ప్రథమ ముద్రణ : 2002 శ్రీరామ నవమి

ప్రతులు : 2000

వెల : రూ॥ **7-00**

ప్రాప్తిస్థానము :
జగద్గురు మందిరము
(ది వరల్డ్ టీచర్ టెంపుల్)
'రాధామాధవమ్',
14-38-02, ముప్పిడి కోలనీ,
విశాఖపట్నం - 530 002.

ముద్రణ :
ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్,
విశాఖపట్నం-530 016.
ఫోన్ : 0891-747320, 751329




శ్రీశ్రీశ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామి

(సియా రఘువర్ దాస్)




**శ్రీశ్రీశ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామి**

**(సియా రఘువర్ దాస్)**

# ప్రస్తావన

కలియుగమున నామ స్మరణమునకే ప్రాధాన్యత. నామ స్మరణమును ప్రప్రథమముగా జీవులకందించిన మహాపురుషుడు హనుమంతుడే! రామునికన్న రామనామ మెంత గొప్పదో తెలియ చెప్పినవాడు భక్తాగ్రగణ్యుడైన ఆంజనేయుడు. ఈ భూమిపై రామనామము స్మరింపబడుచున్నంత కాలము తాను భూమిపైననే యుండి, స్మరించు జీవులకు సర్వ శుభములను చేకూర్చెద నని వాగ్దానము చేసిన మహావీరుడు. రామనామము హనుమంతునికి ప్రీతి కల్గించును. అట్లే హనుమత్ స్మరణము రామునికి ప్రీతి కల్గించును.

శ్రీ మహావిష్ణువే శ్రీరామునిగా అవతరించిన సందర్భమున శంకరుడు 'హనుమ'గా

వ్యక్తమయ్యెను. దైవమగు రామునికి జీవులకు మధ్య వారధిగా నిలబడెను. అది కారణముగా సద్గురువయ్యెను. రామాయణమున సుందర కాండము ఈ సత్యమును ఆవిష్కరించును. హనుమంతు నారాధించువారు, రామ కృపను కోరువారు సుందరకాండను తరచుగా పఠించు చుందురు. వాల్మీకి మహర్షి రచించిన రామాయణ మందలి సుందరకాండము గురు దర్శనమునకు, బంధ విమోచనమునకు అటుపైన పరమ పదమునకు ఉపాయము. హనుమత్ దర్శనము, అనుగ్రహము కలుగుటకు సుందరకాండ మెంత ప్రసిద్ధమో, భక్త తులసీదాస్ రచించిన 'హనుమన్ చాలీసా' కూడ అంత ప్రసిద్ధము మరియు శక్తివంతము, సులభము గూడ. హనుమాన్

చాలీసాను శ్రద్ధా భక్తులతో పఠించి ఎందరో శ్రద్ధాళువులు సంసారమున తరించుచున్నారు. ఆంధ్రదేశమున హనుమాన్ చాలీసాను పరిచయము చేసి, పఠింపచేసి, ఉపదేశమిచ్చి, చిరంజీవియై దివ్య శరీరమున అనుగ్రహించు చున్న **శ్రీశ్రీశ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామిని** యీ సమయమున తప్పక జ్ఞప్తికి తెచ్చుకొన వలెను. 20వ శతాబ్దమున ఆంధ్రులకు భక్తి మార్గమున పునాదులు వేసిన మహనీయులలో **శ్రీశ్రీశ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామి** (సియా రఘువర్ దాస్) గణనీయులు. ఈ పుస్తక ప్రచురణము వారికి అంకితము.

హనుమంతుని ఆరాధనము కుజుడు, శని, రాహువు, కేతువుల దోషము గల వారికి

చక్కని ఔషధము. దోషనివారణము తప్పక జరుగును. హనుమంతుని ఆరాధనము కాల పురుషుడైన లక్ష్మణునకు, పరమ పురుషుడైన రామునకు, ప్రకృతి శక్తియైన జానకికి ఆహ్లాదము కలిగించి ఉన్ముఖులను చేయును. అట్లే భూత, ప్రేత, పిశాచముల బారినుండి రక్షించును. సమస్త సంకటములను తొలగించును.

దినమునకు 11 పర్యాయములు చదువుట ఒక సంప్రదాయము. అట్లు 40 రోజులు దీక్షగా చదువుట మరియొక సంప్రదాయము. ఒకేసారిగా 100 సార్లు ఇంకొక సంప్రదాయము. ఎట్లైననూ భక్తితో చదువుట ముఖ్యము.

తల్లిదండ్రుల యందు పూజ్యభావము, వినయము కలిగి యుండుట సంస్కారవంతుల

లక్షణము. అది ముఖ్యమైన భరత ధర్మము, ఈ ధర్మమును అనునిత్యము అనుసరించు సోదరులు, **వడలి సూర్య ప్రకాశరావు, అనసూయ దంపతి** ఈ ముద్రణమునకు ధన సహాయము చేసి, సర్వాంగ సుందరముగా తీర్చి దిద్దినారు. వారి కుటుంబమునకు **హనుమ** ఆయురారోగ్య ఐశ్వర్యములను, సర్వ సమృద్ధిని ప్రసాదించ వలెనని మా ప్రార్థన.

'శ్రీ వృష'
మాఘపౌర్ణమి
రామాద్రి

పార్వతి కుమార్ కే.

## ప్రణామః

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో
నమామ్యహమ్ ॥
రామాయ రామభద్రాయ రామచన్ద్రాయ వేధసే।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః॥

## ఆంజనేయ ప్రార్థన

అతులిత బలధామం స్వర్ణశైలాభదేహం
దనుజవనకృశానుం జ్ఞానినా మగ్రగణ్యమ్ ।
సకలగుణనిధానం వానరాణా మధీశం
రఘుపతిప్రియభక్తం వాతజాతం నమామి ॥

గోష్పదీకృత వారాశం మశకీకృత రాక్షసమ్ ।
రామాయణ మహామాలా రత్నంవందే ఉనిలాత్మజమ్॥
అంజనానన్దనం వీరం జానకీశోకనాశనమ్ ।
కపీశ మక్ష హన్తారం వన్దే లంకాభయంకరం ॥

ఉల్లఙ్ఘ్యసిన్ధోః సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మ జాయాః ।
ఆదాయ తేనైవ దదాహ లంకామ్
నమామి తం ప్రాఞ్జలి రాఞ్జనేయమ్ ॥

మనోజవం మారుత తుల్యవేగం
జితేన్ద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి ॥

ఆంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రి కమనీయవిగ్రహమ్ ।
పారిజాత తరుమూల వాసినం
భావయామి పవమాన నన్దనమ్ ॥

యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాఞ్జలిమ్ ।
బాష్పవారి పరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాన్తకమ్ ॥

## చాలీసా

**శ్రీ గురుచరణ సరోజరజ నిజమనముకుర సుధారి**
**చరణౌ రఘువర విమల యశ, జో దాయక ఫలచారి॥**

శ్రీ గురుదేవుల పాదపద్మాల పవిత్ర ధూళితో నా మనస్సు అనే అద్దాన్ని చక్కగా కడిగి ధర్మార్థకామ మోక్షాలనే నాల్గు ఫలాలను ఇవ్వగల శ్రీరామచంద్రుని నిర్మల యశస్సును వర్ణించటానికి ప్రయత్నించుతాను.

**బుద్ధిహీన తను జానికై సుమిరౌ పవన కుమార్ ।**
**బలబుద్ధి విద్యా దేహు మోహి, హరహు కలేశ వికార్॥**

నా బుద్ధిహీనతను గుర్తించి ఆంజనేయుని స్మరించుతున్నాను. ఓ పవనపుత్రా, నాకు శక్తిని, బుద్ధిని, విద్యను ప్రసాదించు; నా దోషాలను, వికారాలను తొలగించు.

## చౌపాయి

1. జయ హనుమాన జ్ఞానగుణసాగర ।
జయ కపీశ తిహులోక ఉజాగర ॥

2. రామదూత అతులిత బలధామా
అంజనిపుత్ర పవన సుతనామా

3. మహావీర విక్రమ బజరంగీ ।
కుమతి నివార సుమతి కే సంగీ

1. జ్ఞాన సద్గుణ సాగరమైనటువంటి ఓ హనుమన్మూర్తీ! ముల్లోకాలకు జ్ఞానకాంతి నిచ్చే కపీశ్వరా! జయం! జయం!

2. శ్రీరామునికి దూత ఐనవాడా! సాటిలేని బలానికి నిలయమైనవాడా! అంజనాదేవి కుమారా! వాయుదేవుని పుత్రా!

3. మహావీరా! పరాక్రమధీరా! వజ్రం లాంటి సుదృఢ దేహం గలవాడా! దుర్బుద్ధిని నశింపచేస్తూ, సద్బుద్ధిని పెంపొందించే వాడా!

4. కంచన వరణ విరాజసువేశా ।
కానన కుండల కుంచితకేశా ॥

5. హాథ వజ్ర అరు ధ్వజా విరాజై ।
కాంధే మూంజ జనేవూ ఛాజై ॥

6. శంకర సువన కేసరీ నందన ।
తేజ ప్రతాప మహాజగవందన ॥

4. బంగారు కాంతుల మేనిచ్ఛాయ వాడా! అతిసుందరమైన వేషధారణం గలవాడా! చెవులకు కుండలాలు ధరించిన వాడా! అందంగా ముడిచిన కేశాలు గలవాడా!

5. చేత వస్త్రం, ధ్వజం కలిగి విరాజిల్లుతున్నవాడా ! భుజస్కంధాల్లో మౌంజి, జందెములతో ప్రకాశిస్తున్నవాడా!

6. రుద్ర వీర్యోద్భవ రుద్రమూర్తీ! కేసరీతనయుడైన హనుమంతా! గొప్ప తేజో ప్రతాపాలున్నవాడా! లోకంచేత పూజింపబడే వాడా!

7. విద్యావాన గుణీ అతి చాతుర ।
రామకాజ కరివేకో ఆతుర ॥

8. ప్రభుచరిత్ర సునివేకో రసియా ।
రామలఖన సీతా మన బసియా ॥

9. సూక్ష్మరూప ధరి సియహి దిఖావా ।
వికట రూప ధరి లంక జరావా ॥

10. భీమరూపధరి అసుర సంహారే ।
రామచంద్రకే కాజ సవారే ॥

7. విద్యావంతుడా, సద్గుణవంతుడా! బహు చాతుర్యం గలవాడా! రామకార్య నిర్వహణలో సతతం ఆతురత చూపేవాడా!

8. శ్రీరామచంద్ర ప్రభువు చరిత్రాన్ని వినటంలో రసికత్వం గలవాడా ! శ్రీ సీతారామ లక్ష్మణులను హృదయసీమలో ప్రతిష్ఠించుకొన్నవాడా !

9. సూక్ష్మరూపంతో సీతామాతకు కనిపించావు. వికటరూపం దాల్చి లంకను దహించావు.

10. భీకరాకారం దాల్చి రాక్షసులను సంహరించావు. రామకార్యాన్ని నిర్వర్తించావు.

11. లాయ సజీవన లఖన జియాయే।
శ్రీ రఘువీర హరఖి వురలాయే ॥

12. రఘుపతి కీన్హీ బహుత బడాయీ।
కహా భరత సమ తుమ ప్రియభాయీ॥

13. సహస వదన తుమ్హారో యశగావై।
అస కహి శ్రీపతి కంఠ లగావై॥

14. సనకాదిక బ్రహ్మాది మునీశా ।
నారద శారద సహిత అహీశా ॥

11. సంజీవని తీసుకువచ్చి లక్ష్మణుణ్ణి రక్షించినావు. అందుకు శ్రీరాముడు సంతసించి నిన్ను తన హృదయానికి హత్తుకొన్నాడు.

12. శ్రీరాముడు ఎంతో ప్రశంసించి "నువ్వు నాకు ప్రియమైన భరతుడితో సమానమైనవాడివి" అన్నాడు.

13. గానంచేసి శ్రీరాముడు నిన్ను ఆలింగనం చేసుకొంటూ, 'ఆదిశేషువుకూడ నీ కీర్తిని వేనోళ్ల గానం చేస్తూన్నాడు' అన్నాడు.

14. సనక సనందనులు, బ్రహ్మ మొదలైనవారు, మునీశ్వరులు, నారదుడు, సరస్వతి, ఆదిశేషుడు...

15. యమ కుబేర దిగపాల జహాఁతే ।
కవి కోవిద కహి సకై కహాఁతే ॥

16. తుమ ఉపకార సుగ్రీవహి కీన్హా ।
రామ మిలాయ రాజపద దీన్హా॥

17. తుమ్హరో మంత్ర విభీషణ మానా।
లంకేశ్వర భయే సబ జగజానా॥

18. యుగ సహస్ర యోజన పర భానూ।
లీల్యో తాహి మధుర ఫల జానూ ॥

15.యమ, కుబేర ఆదిగా గల దిక్పాలకులు, కవులు, పండితులు మొదలైన వారు నీ కీర్తిని గానం ఎలా చెయ్యగలరు ?

16. నువ్వు సుగ్రీవుడికి ఉపకారం చేశావు. శ్రీరామునితో స్నేహం కల్పించి సుగ్రీవుడికి రాజపదవిని యిప్పించావు.

17. విభీషణుడు నీ సలహాను పాటించడం వలన లంకాధిపతి అయ్యాడనే విషయం జగత్ప్రసిద్ధమే గదా!

18. రెండువేల యోజనాల దూరంలో వున్న సూర్యుణ్ణి మధురమైన పండుగా తలచి లీలగా స్పృశించావు.

19. ప్రభు ముద్రికా మేలి ముఖ మాహీ।
జలధి లాంఘి గయే అచరజ నాహీ॥

20. దుర్గమ కాజ జగతకే జేతే।
సుగమ అనుగ్రహ తుమ్హారే తేతే॥

21. రామ దుఆరే తుమ రఖవారే।
హోతన ఆజ్ఞా బిను పైఠారే॥

22. సబ సుఖ లహై తుమ్హారీ శరనా।
తుమ రక్షక కాహూ కో డరనా॥

19. శ్రీరామచంద్రుని ముద్రికను నోట వుంచుకొని సముద్రాన్ని లంఘించి నావంటే ఆశ్చర్యం ఏముంది?

20. లోకంలో దుర్గమమైన ఏ కార్యమైనా నీ అనుగ్రహంతో సుగమం అవుతుంది.

21. నువ్వు శ్రీరాముని వాకిలి కాచేవాడవి. నీ అనుమతి లేకుండా లోనికెళ్లటం వీలుపడదు.

22. నిన్ను శరణు వేడితే సర్వసౌఖ్యాలు చేకూరుతవి. నీ రక్షణలో ఎవరూ భయపడ వలసిన అవసరం లేదు.

23. ఆపన తేజ సమ్హారో ఆపై ।
తీనోంలోక హాంకతే కాంపై ॥

24. భూత పిశాచ నికట నహి ఆవై ।
మహావీర జబ నామ సునావై ॥

25. నాసై రోగ హరై సబ పీరా ।
జపత నిరంతర హనుమత వీరా॥

26. సంకట సే హనుమాన ఛుడావై ।
మన క్రమ వచన ధ్యాన జో లావై॥

23. నీ తేజస్సును నువ్వే నిభాయించుకో గలవు. నీకు ముల్లోకాలు గడగడలాడతాయి.

24. మహావీరా! నీ పేరు వింటేనే భూతప్రేత పిశాచ గణాలు సమీపించలేవు.

25. వీరహనుమంతుణ్ణి సదా జపిస్తే సర్వరోగాలు నయమవుతాయి, పీడలు తొలగిపోతాయి.

26. మనోవాక్కాయాలతో ఎవరు హనుమంతుణ్ణి ధ్యానిస్తారో వారిని ఆతడు అన్ని కష్టాలనుంచి కాపాడతాడు.

27. సబ పర రామరాయ సిరతాజా ।
తినకే కాజ సకల తుమ సాజా ॥

28. ఔర మనోరథ జోకోయి లావై ।
తాసు అమిత జీవన ఫల పావై ॥

29. చారో యుగ పరతాప తుమ్హారా ।
హై పరసిద్ధి జగత వుజియారా ॥

27. రాజులందరికీ శ్రీరాముడు కిరీటం వంటివాడు. తపస్సంపన్నులకు ప్రభువువంటి వాడు. నువ్వు రామ కార్యాలన్నింటిని సక్రమంగా నెరవేరుస్తుంటావు.

28. (హనుమంతుని భక్తులు) మనోరథాలన్నీ పొందటమేగాక, శాశ్వతానంద దాయకమైన మోక్షఫలాన్ని కూడా పొందుతారు.

29. నీ ప్రతాపం నాల్గుయుగాల్లోను ప్రసిద్ధం. నీ కీర్తి ప్రపంచమంతా ఉజ్వలంగా ప్రకాశిస్తోంది.

30. సాధు సంత కే తుమ రఖవారే ।
అసుర నికందన రామ దులారే ॥

31. అష్టసిద్ధి నవ నిధి కే దాతా ।
అస వర దీన్హ జానకీమాతా ॥

32. రామ రసాయన తుమ్హారే పాసా ।
సాదర తుమ రఘుపతి కే దాసా ॥

33. తుమ్హారే భజన రామకో భావై ।
జన్మజన్మకే దుఃఖ బిసరావై ॥

30. సాధువులనూ, సజ్జనులనూ రక్షి స్తుంటావు. రాక్షసులను సంహరించి శ్రీరామునికి ప్రేమాస్పదుడవైనావు.

31. అణిమాద్యష్టసిద్ధులను, నవ నిధులను సంప్రాప్తింప చేసేవాడివి. అదే వరాన్ని సీతాదేవి నీకు ఒసగివుంది.

32. నీవద్ద రామరసాయనం వుంది. నువ్వు శ్రీరామునికి నమ్మినబంటువు.

33. నిన్ను (మేము) సేవించటం, శ్రీరామునికి సంతోషం కలిగిస్తుంది. జన్మ జన్మాంతరాల దుఃఖాన్ని ఉపశమింపచేస్తుంది.

34\. అంతకాల రఘుపతిపుర జాయీ ।
జహా జన్మి హరిభక్త కహాయీ ॥

35\. ఔర దేవతా చిత్త న ధరయీ ।
హనుమత సేయి సర్వసుఖకరయీ ॥

36\. సంకట హటై మిటై సబపీరా ।
జో సుమిరై హనుమత బలవీరా ॥

37\. జై జై జై హనుమాన గొసాయీ ।
కృపాకరో గురుదేవ కీ నాయీ ॥

34. నీ భక్తుడు చనిపోయి రామ లోకాన్ని పొంది, హరి భక్తుడుగా జన్మిస్తాడు.

35. ఇతర దేవతలను మనస్సులో తలచుకోక, హనుమంతుణ్ణే సేవిస్తే, సర్వ శుభాలను ప్రసాదిస్తాడు.

36. బలవంతుడూ, వీరుడూ ఐన హనుమంతుణ్ణి ఆరాధిస్తే, కష్టాలన్నీ, పీడలన్నీ తొలగిపోతాయి, పటాపంచ లైపోతాయి.

37. ఓ ఆంజనేయా! నీకు జయమగు గాక; ఓ గురుదేవా, మమ్మల్ని అనుగ్రహించు.

38. యహ శతవార పాఠ కర జోయీా ।
ఛూటహి బంది మహాసుఖ హోయీా॥

39. జో యహ పఢై హనుమాన చాలీసా ।
హోయసిద్ధి సాఖీ గౌరీసా ॥

40. తులసీదాస సదా హరిచేరా ।
కీజై నాథ హృదయ మహ డేరా ॥

38. ఈ 'హనుమాన్ చాలీసా'ను నూరుమార్లు ఎవరు పారాయణం చేస్తారో వారు బంధాలనుండి విడివడి సౌఖ్యాన్ని పొందుతారు.

39. అతిప్రశస్తమైన యీ 'హనుమాన్ చాలీసా'ను ఎవరు పారాయణం చేస్తారో వారు పార్వతీ పరమేశ్వర సాక్షిగా సిద్ధి పొందుతారు.

40. భక్తుల్లో అగ్రగణ్యుడైన తులసీదాసు ఎప్పుడూ శ్రీహరికి దాసుడే! ఓ ప్రభూ! నువ్వు నా హృదయసీమలో నివసించు.

## దోహా

పవనతనయ సంకట హరన

మంగళ మూరతి రూప ।

రామలఖన సీతాసహిత

హృదయ బసహు సురభూప ॥

సంకట నాశకుడు, మంగళరూపుడు, దేవతాధిపతీ, పవనతనయుడు అయిన నువ్వు శ్రీ సీతారామ లక్ష్మణులతో కూడి సదా నా హృదయంలో ఆసీనుడవుకమ్మని ప్రార్థిస్తూన్నాను.

## శ్రీ రామదూతం శిరసానమామి

మకుటరత్న కాంతి–మథితతమిస్రం
శ్రీరామదూతం శిరసానమామి

అరుణోదయరుచి–రాననకమలం ।శ్రీరామ।

స్వర్ణపింగళభా–స్వరనేత్రయుగళం

చలితమకరకుండల–గండభాగం

నవమణిమయ–రసనామధ్యభాగం

తరుణిరుచిర–శుభతరవరహారం

సమలంకృతదివ్య–స్వర్ణోపవీతం

కటితటవిలసిత–కాంచనచేలం

మంజుమంజీర–మహితపదాబ్జం ।శ్రీరామ।

దినమణిశతనిభ–దివ్యప్రకాశం

సకలసద్గుణబృంద–సారపయోధిం

దాసముఖాంభోజ–దశశతభానుం

వాల్మీకికృతకావ్య–వరసరోహంసం

శ్రితజనకువలయ–శీతమయూఖం

రామలావణ్యాభ్ర–రాగమయూరం

రామచంద్రపాద–రాజీవమధుపం

తరుణాయతదో–స్తంభగంభీరం

సుగ్రీవ శ్రీరామ–సంధానహేతుం

సుగ్రీవవేదిత–శ్రీరామవృత్తాంతం ।శ్రీరామ।
అగ్నిసాక్షీకృత–అర్కజరామం
సీతాభూషణ–సమర్పితరామం
శ్రీరామసుగ్రీవ–సఖ్యోల్లాసం
వాలివధోపాయ–వరమృదువాక్యం
సుగ్రీవ పట్టాభి–షేక ప్రవీణం
వానరసేనా–సమాహూతధీరం
సకల దేశాగత–శాఖామృగాళిం
రామచంద్రదత్త–రమణీయభూషం
స్వయంప్రభాదత్త–సుఫలాతిభోజ్యం
లంకాగమన–సమలంకృతదేహం

సాగరోల్లంఘన–సంపూర్ణకాయం ।శ్రీరామ।

అబ్ధిమధ్యమిత్ర–అగపతిపూజ్యం

సురసమాయాధ్వాంత–సూర్యప్రకాశం

ఛాయాగ్రాహీచ్ఛేద–శమనస్వరూపం

దివ్యద్వేగకృత–గోష్పాదజలధిం

సువేలాశిఖరాగ్ర–శమితాభిగమనం

లంకిణీభంజన–లావణ్యసారం

లంకావరోధని–శ్శంకితహృదయం

సీతాన్వేషణ–సురశత్రుసదనం

వాయుప్రేరిత–వరవనగమనం

సీతాదర్శన-చింతాపహరణం ।శ్రీరామ।

రావణదుర్వాక్య-అక్షీణకోపం

సీతానివేదిత-శ్రీరామకుశలం

రాఘవీయకథా-రంజితరామం

రామాంగులీయక-రామానివేద్యం

వసుధాత్మజాదత్త-వరశిరోజభూషం

అతిశయబలదర్ప-అశోకభంగం

దనుజనివహవన-దహనదావాగ్నిం

వజ్రాయుధఘోర-వరకరవాలం

సప్తమంత్రిసుత-శలభకృశానుం

జంబుమాలివధ–చండప్రతాపం ।శ్రీరామ।

అక్షకుమారసం–హరణవిక్షేపం

బ్రహ్మాస్త్ర బంధిత–బ్రహ్మావరదానం

చాతుర్భాగ సైన్య–చండితరూపం

వాయుప్రేరిత–వాలాగ్నిజ్వాలం

సీతాప్రసాదిత–శీతలవాలం

వర రాక్షసగృహ–వహ్ని సందగ్ధం

కపిదృక్చకోరసం–గతచంద్రబింబం

తారానందనాది–తరుచర యుక్తం

మధువన మధుపాన–మత్తకపీంద్రం

కౌసలేయకార్య–కరణసమర్థం ।శ్రీరామ।

రామనివేదిత–రామావృత్తాంతం

వరవిభీషణరక్ష–వాక్యనైపుణ్యం

రామసంవర్ధిత–రాక్షస సఖ్యం

అబ్ధిబంధనకార్య–అమితోత్సాహం

ప్రభల జలధిసేతు–బంధననిపుణం

ధూమ్రాక్షాకంపన–త్రిశిరస్సంహారం

రామప్రసాధిత–రాక్షసనాశం

రణకర్కశఘోర–రాజితవేషం

రావణఘనయుద్ధ–రామతురంగం

మేఘనాదసైన్య–మృత్యుస్వరూపం

రక్షేంద్రజిద్యుద్ధ–లక్ష్మణతురంగం ।శ్రీరామ।

లక్ష్మణమూర్ఛాసం–రక్షణహృదయం

సంజీవాద్రిగమన–సంతోషస్వాంతం

కాలనేమికృత–ఘనమాయాయుక్తం

మకరబంధీకృత–మహితపదాబ్జం

ధ్యానమాలినీశాప–ధర్షితరూపం

కాలనేమిదనుజ–ఖండితధీరం

ధిక్కృతాऽద్ర్యధీశ–తీవ్రప్రకోపం

గంధర్వసైన్యసం–క్షోభప్రతాపం

స్తబకీకృతధృత–సంజీవనాద్రిం

భరతసంబోధిత–ప్రశమితబాణం

మాల్యవదాది–మహోదధిహరణం ।శ్రీరామ।

లక్ష్మణప్రాణసం–రక్షణనిలయం

సౌమిత్రిసమ్మోహ–జలదసమీరం

అబ్ధిమధ్యమధిత–రాక్షసవారం

స్థూలజంఘాసుర–తుములసంహరణం

సింధూల్లంఘన–జలదసమీరం

వాలప్రాకార–సంవేష్టితవీరం

పాతాళలంకా–ప్రవేశితధీరం

మత్స్యవల్లభధీర–మహానీయభీతిం

మైత్రీకృతధీర–మత్స్యాధిపత్యం

దోర్దండీకృతమిత్ర–ధైర్యప్రతాపం

భిన్నతులాయంత్ర–భీమస్వరూపం ।శ్రీరామ।

బలరాక్షసకోటి –భంజితసత్వం

శ్రుతివాక్యశ్రవణసం–తోషితకాళిం

మైరావణకృత–మర్మసంవేద్యం

మైరావణసైన్య–మర్దితశూరం

మహోనీయాతిఘోర–మైరావణాజిం

దోర్దండివాక్యాతి–ఖండిత దైత్యం

నీలమేఘకృత–నిస్తులరాజ్యం

రామలక్ష్మణపూర్వ–లంకాభిగమనం

సకలవానర స్తుతి–సంతోషహృదయం

ప్రబలమూలబల – ప్రళయకాలాగ్నిం ।శ్రీరామ।

రామరావణయుద్ధ – రామతురంగం

దశకంఠకంఠవి – లుంఠనదీక్షం

రాక్షసానుజదత్త – లంకాభిషేకం

పుష్పకాధిరూఢ – పృథ్వీశసహితం

సాకేతపురవాస – సబలసంయుక్తం

భక్తపాపతిమిర – భాస్కరరూపం

శతకంఠ వధోపాయ – చాతుర్యయుక్తం

ఏకైక రాక్షస – ఏకైకరూపం

శతకంఠచ్ఛేదక – సీతాప్రబోధం

అవనిజాధిపయుక్త–రాజ్యప్రవేశం ।శ్రీరామ।

అశ్వమేధయుగ–అమితోత్సాహం

దశశతశిరశ్ఛేద–దక్షప్రతాపం

దశశతశిరోధార్య–భాష్యాతిరిక్తం

రాక్షససైన్యాజి–భయదస్వరూపం

దశశతశిరశ్ఛేద–దశరథసూనుం

సకల సైన్యావృత–సాకేతవాసం

బోధితకపివర్య–పూర్ణస్వరూపం

ఠంకారోట్చాటిత–ఢాకినీసైన్యం

చలితవాలసం–వేష్టితకాయం

యజితరామపాద–యజురాదివాక్యం ।శ్రీరామ।

శ్రీకాకుళేశా–శ్రితమందారం

భక్తజనకాంక్ష–ముక్తినిదానం

లీలావినోదిత–దాసస్వరూపం

పరిపాలితభక్త–పాదపకల్పం

బుధజనవేదిత–పూర్ణస్వరూపం

మోహనఘనపెద–ముత్తేవివాసం

భద్రాచలరామ–భద్రసమేతం

వరసుందరరామ–దాసానుపాలం

మంగళమంజనా–మారుతపుత్రం

# శ్రీ ఆంజనేయ దండకం

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాదివ్యకాయం ప్రకీర్తిప్రదాయం భజే వాయుపుత్రం భజే వాలగాత్రం భజే ఉహం పవిత్రం భజే బ్రహ్మమిత్రం భజే రుద్రరూపం భజే బ్రహ్మతేజం బటంచున్ ప్రభాతంబు సాయంత్రమున్ నీదు సంకీర్తనల్‌జేసి నీ రూపు వర్ణించి నీ మీద నే దండకం బొక్కటిం జేయ నూహించి నీ మూర్తి గావించి నీ సుందరం బెంచి నీ దాస దాసుండనై నిన్ను నే గొల్చెదన్ నీ కటాక్షంబునన్ జూచితే వేడుకల్ జేసితే నా మొరాలించితే నన్ను రక్షించితే అంజనాదేవి గర్భాన్వయాదేవ!

నిన్నెంచ నే నెంతవాడన్ దయాశాలివై జూచితే
దాతవై బ్రోచితే దగ్గరం బిల్చితే తొల్లి
సుగ్రీవుకున్మంత్రివై స్వామి కార్యంబు
నందుండి శ్రీరామ సౌమిత్రులం జూచి
వారిన్విచారించి సర్వేశు బూజించి
యబ్భానుజుం బంటుగావించి యవ్వాలి
జంపించి కాకుత్థ్సు తిలకుం దయాదృష్టి
వీక్షించి కిష్కింధ కేతెంచి శ్రీరామ కార్యార్థమై
లంక కేతెంచియున్ లంకిణిన్ జంపియున్
లంకయుం గాల్చియున్ భూమిజం జూచి
యానంద ముప్పొంగ యా యుంగరం బిచ్చి
యా రత్నమున్ దెచ్చి శ్రీరాముకు న్నిచ్చి
సంతోషినిం జేసి సుగ్రీవుడున్ అంగదున్

జాంబవంతాది నీలాదులం గూడి యా
సేతువుం దాటి వానరుల్ మూక పెన్మూకలై
దైత్యులన్ ద్రుంచగా రావణుండంత కాలాగ్ని
యుగ్రుండునై కోరి బ్రహ్మాండ మైనట్టి
యాశక్తియున్ వేసి యాలక్ష్మణున్ మూర్ఛ
నొందించగా నప్పుడే పోయి సంజీవినిన్
దెచ్చి సౌమిత్రికి న్నిచ్చి ప్రాణంబు రక్షించగా
కుంభకర్ణాది వీరాళితో బోరి చెండాడి శ్రీరామ
బాణాగ్ని వారందరున్ రావణుం జంపగా
నంత లోకంబు లానందమైయుండ నవ్వేళలన్
నవ్విభీషణున్ వేడుకన్ దోడుకన్ వచ్చి
పట్టాభిషేకంబు చేయించి సీతామహాదేవినిం
దెచ్చి శ్రీరాముకు న్నిచ్చి నయోధ్యకుం వచ్చి

పట్టాభిషేకంబు సంరంభమైయున్న నీకన్న నా
కెవ్వరున్ గూర్మిలేరంచు మన్నించినన్
రామభక్తి ప్రశస్తంబుగా నిన్ను నీనామ
సంకీర్తనల్ జేసితే పాపముల్ బాయునే
భయములున్ దీరునే భాగ్యముల్ గల్గునే
సకల సామ్రాజ్యముల్ సకల సంపత్తులున్
గల్గు నో వానరాకార యో భక్తమందార
యోపుణ్యసంచార యో ధీర యో శూర నీవే
మహా ఫలముగా వెలసి యా తారక బ్రహ్మ
మంత్రంబు పఠియించుచున్ స్థిరముగా
వజ్రదేహంబునుం దాల్చి శ్రీరామ యంచున్
మనఃపూతమై యెప్పుడున్ దప్పకన్ దల్తు నా
జిహ్వాయందుండి నీ దీర్ఘదేహంబు త్రైలోక్య

సంచారివై రామ నామాంకిత ధ్యానివై బ్రహ్మవై బ్రహ్మ తేజంబునన్ రౌద్ర విజ్వాల కల్లోల హా వీరహనుమంత ఓంకార ఓంకార శబ్దంబునన్ భూత ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ గాలి దయ్యంబులన్ నీదు వాలంబునంజుట్టి నేలం బడం గొట్టి నీ ముష్టి ఘాతంబులన్ బాహు దండంబులన్ రోమ ఖండంబులన్ ద్రుంచి కాలాగ్ని రుద్రుండవై బ్రహ్మ ప్రభా భాసితంబైన నీ దివ్య తేజంబునుం జూపి రారా నా ముద్దు నరసింహ యుంచున్ దయాదృష్టి వీక్షించి నన్నేలు నాస్వామి నమస్తే వ్రత పూర్ణకారీ నమస్తే వాయుపుత్రా నమస్తే నమస్తే నమః ॥

# శ్రీ హనుమ ద్వాదశనామ స్తోత్రమ్

హనుమా నంజనాసూనుః
వాయుపుత్రో మహాబలః ।
రామేష్టః ఫల్గుణసఖః
పింగాక్షో ఉ మిత విక్రమః ॥ 1

ఉదధి క్రమణశ్చైవ
సీతాశోక వినాశకః ।
లక్ష్మణ ప్రాణదాతాచ
దశగ్రీవస్య దర్పహా ॥ 2

ఏవం ద్వాదశనామాని
కపీంద్రస్య మహాత్మనః ।
స్వాపకాలే ప్రబోధేచ
యాత్రా కాలేచ యః పఠేత్ ॥ 3

తస్య సర్వభయం నాస్తి
రణే చ విజయీ భవేత్ ।
రాజద్వారే గహ్వరే చ
భయం నాస్తి కదాచన ॥ 4

*హనుమంతుని ఈ పండ్రెండు నామాలు పఠుండబోవునపుడు. ప్రయాణ సమయమున పఠించిన మృత్యుభయ ముండదు. సర్వత్ర విజయము కలుగును.*

# శ్రీరామ నామ సంకీర్తనము

శ్లో॥ వర్ణానా మర్థ సంఘానాం రసానాం ఛన్దసా మపి ।
మఙ్గలానాం చ కర్తారౌ వన్దే వాణీ వినాయకౌ ॥

2. భవానీ శంకరౌ వన్దే శ్రద్ధా విశ్వాస రూపిణౌ ।
యాభ్యాం వినా న పశ్యన్తి సిద్ధాః స్వాన్తస్థ మీశ్వరమ్॥

3. వన్దే బోధమయం నిత్యం గురుం శంకర రూపిణమ్।
యమాశ్రితో హి వక్రోఽపి చన్ద్రః సర్వత్ర వన్ద్యతే॥

4. సీతా రామ గుణ గ్రామ పుణ్యారణ్య విహారిణౌ ।
వన్దే విశుద్ధ విజ్ఞానౌ కవీశ్వర కపీశ్వరౌ ॥

5. ఉద్భవ స్థితి సంహార కారిణీంక్లేశ హారిణీమ్ ।
సర్వ శ్రేయస్కరీం సీతాం నతోఽహం రామవల్లభామ్॥

6. య న్మాయా వశ వర్తి విశ్వ
మఖిలం బ్రహ్మాది దే వాసురాః ।
య త్సత్త్వా దమృ షైవ భాతి సకలం
రజ్జౌ యథా ఽ హే ర్భ్రమః ॥
య త్పాదః ప్లవ మేవ భాతి హి
భ వా మ్భోధే స్తి తీర్షావతాం।
వన్దే ఽ హం త మశేష కారణ పరం
రామాఖ్యమీశం హరిమ్ ॥

7. ప్రసన్నతాం యా న గ తాభిషేకత
స్తథా న మమ్లౌ వన వాస దుఃఖతః ।
ము ఖామ్బుజ శ్రీ రఘు నన్దనస్య మే
సదాఽ స్తు సా మఞ్జుల మఙ్గల-ప్రదా ॥

8. నీ లామ్బుజ శ్యామల కోమ లాఙ్గం
సీతా సమారోపిత వామ భాగమ్ ।
పాణౌ మహాసాయకచారు చాపం
నమామి రామం రఘువంశనాథమ్ ॥

9. మూలం ధర్మతరో ర్వివేక జలధేః
పూర్ణేన్దు మానన్దదం।
వైరా గ్యామ్బుజ భాస్కరం త్వఘహరం
ధ్వా న్తాపహం తాపహమ్ ।
మో హామ్భోధర పుఞ్జ  పాటన విధౌ
ఖే సంభవం శంకరం ।
వన్దే బ్రహ్మ కులే కలఙ్క శమనం
శ్రీరామ భూప ప్రియమ్ ॥

10. సా ంద్రానన్ద పయోద సౌభగ తనుం
పీ తామ్బరం సున్దరం ।
పాణౌ బాణ శరాసనం కటి లస
త్తూణీర భారం వరమ్ ।
రాజీ వాయత లోచనం ధృత జటా
జూటేన సంశోభితం ।
సీతా లక్ష్మణ సంయుతం పథి గతం
రా మాభిరామం భజే ॥

11. కు న్దేన్దీవర–సున్దరా వతి బలౌ
విజ్ఞాన ధామా వుభౌ ।
శోభాఢ్యా వర ధన్వినౌ శ్రుతి నుతౌ
గో విప్ర బృన్ద ప్రియౌ ।

మాయా మానుష రూపిణౌ రఘువరౌ
స ద్ధర్మవన్తౌ హి తౌ ।
సీ తాన్వేషణ తత్పరౌ పథిగతౌ
భక్తి ప్రదౌ తౌ హి నః ॥

12. బ్రహ్మో మ్భోధి సముద్భవం
కలి మల ప్రధ్వంసనం చావ్యయం ।
శ్రీమ చ్ఛమ్భు ము ఖేన్దు సున్దర వరే
సంశోభితం సర్వదా ।
సంసా రామయ భేషజం
సుమధురం శ్రీ జానకీ జీవనం ।
ధన్యా స్తే కృతినః పిబన్తి సతతం
శ్రీరామ నా మామృతమ్ ॥

13. శాన్తం శాశ్వత మప్రమేయ మనఘం
నిర్వాణ శాన్తి ప్రదం ।
బ్రహ్మా శమ్భు ఫ ణీన్ద్ర సేవ్య మనిశం
వే దాన్త వేద్యం విభుమ్ ।
రా మాఖ్యం జగ దీశ్వరం సురగురుం
మాయా మనుష్యం హరిం ।
వన్దే ఽ హం కరు ణాకరం రఘువరం
భూపాల చూడామణిమ్ ॥

14. కేకీ కణ్ఠాభ నీలం సురవర–విలస
ద్విప్ర పా దాబ్జ చిహ్నం ।
శోభాఢ్యం పీత వస్త్రం సరసిజ
నయనం సర్వదా సుప్రసన్నమ్ ।

పాణౌ నారాచ చాపం కపి నికర
యుతం బన్ధునా సేవ్యమానం ।
నౌ మీడ్యం జాన కీశం రఘు వర
మనిశం పుష్పకారూఢ రామమ్ ॥

15. ఆర్తానా మార్తి హన్తారం
భీతానాం భయనాశనమ్।
ద్విషతాం కాల దణ్డం తం రామచన్ద్రం
నమా మ్యహమ్ ॥

16. శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘు కులాన్వయ రత్నదీపమ్।
ఆజానుబాహు మరవిన్ద ద ళాయ తాక్షం

రామం నిశాచర వినాశకరం నమామి॥

17. వైదేహీ సహితం సుర ద్రుమ తలే
హైమే మహా మణ్డపే ।
మధ్యే పుష్పక మాసనే మణిమయే
వీరాసనే సుస్థితమ్ ।
అగ్రే వాచయతి ప్రభఞ్జన సుతే తత్త్వం
మునీభ్యః పరం ।
వాఖ్యాన్తం భర తాదిభిః పరివృతం
రామం భజే శ్యామలమ్ ॥

